పాపం - రాధాదేవి తల్లి ఐదురోజుల క్రితమే చనిపోయిందట! అక్కడి వ్యవహారాలన్నీ చూసుకొని వొచ్చేందుకు మరో పదిరోజులన్నా పడుతుందట! యీ లోగానే కట్లు విప్పుతారనీ, తనకు తప్పకుండా దృష్టి వొచ్చేందుకు భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాననీ, కట్లు విప్పగానే ఉత్తరం రాయించమనీ రాసిం దామె. నిర్మలఅంతా చదివి 'పాపం! రాధ ఎంత మంచిది!' అని నిట్టూర్చింది.

తనేమీ మాట్లాడలేదు. రాధ మంచితనమంతా తనకేనని గర్వం ఒక పక్కా, ఆమె దైన్యస్థితి మరోపక్కా వేధించినవి. మళ్లీ ఉత్తరం రాసేందుకు మాత్రం ఏముంది? ఎవరిచేతనన్నా రాయించాలి... మౌనంలోనే రకరకాల ఆలోచనల్లో మునిగిపొయ్యాడు.

# 9

"ఇవాళ మీ కట్లు విప్పుతారు. మిమ్మల్ని థియేటర్‌కు తీసుకొని వెళ్ళబోతున్నాం' అంది జానకి.

ఏదో షాక్ తగిలినట్లయింది. ఇన్నాళ్ళూ లేని ఆతృత ఆపాదమస్తకమూ వొణికించింది. నిజానికి తన దృష్టి విషయమే మరిచిపొయ్యాడు. ఒక కష్టాన్ని కప్పిపుచ్చే సుఖం ఆవరించి మరిపింపజేసింది ... ఇప్పుడు తన జీవితసౌఖ్యమంతా అటో, ఇటో తేలే సంఘటన రానే వొచ్చింది. దీన్ని ఎదొర్కొనేందుకు సిద్ధంగా లేనందువల్ల భయోత్పాతం కలిగింది.

ఎలాగో ఆ షాక్ తట్టుకున్నాడు. థియేటర్‌కు తీసుకొని పోబడుతూన్నప్పుడు, ఒకవేళ దృష్టి రాకున్నప్పటికీ, రాధాదేవి సహచర్యంతో జీవితం హాయిగా గడుస్తుంది గనుక, విచారించటంలో అర్థంలేదనే తలపు మెరవగానే చాలా తృప్తి కలిగింది. ఎటు తేలినా తను లెక్కచెయ్యక్కర్లేదు.

థియేటర్‌లో పడుకోబెట్టారు.

'మిష్టర్! మీ కట్లు విప్పుతున్నాం. మీ రేమీ భయపడకండి...' అన్నాడు డాక్టర్.

మెల్లిగా, బాధలేకుండా, జాగ్రత్తగా కట్లు విప్పారు. మూతపడి వున్న రెప్పల్ని కడిగి, మెల్లిగా తెరిచి, క్రిమిసంహారి ద్రావకాన్ని వేశారు...

'మిష్టర్! మెల్లిగా కళ్ళు తెరవండి.'

మొందట్లో కళ్ళు తెరిచేందుకు భయం వేసింది. కాని తెరవటంవల్ల యీ ఆతృతన్నా తగ్గుతుంది కదా! భయపడుతూనే రెప్పల్ని కొద్దిగా ఎత్తాడు–ఏమీకనిపించటం లేదు...శాశ్వత అంధత్వం రానే వొచ్చిందను కున్నాడు.

'తెరవండి.. కళ్ళు తెరవండి...ఎందుకు మూసేస్తారు?' అన్నాడు డాక్టర్. ఇంకా ఆశలున్నవని తోచింది.

యీసారి మళ్ళీ తెరిచాడు; క్రమంగా! పూర్తిగా తెరిచాడు.... అంతా బూజు బూజుగా, నీళ్ళధారల్తో కడిగివేస్తున్నట్లుంది. ఏవస్తువూ విశిష్టరూపాన్ని చూపటంలేదు. కొంతవరకే దృష్టివొచ్చిందేమో ?

డాక్టర్ కళ్ళు మరోసారి తుడిచాడు,

'భయపడకండి...కాంతికి కళ్ళు తట్టుకోలేవు. క్రమంగా అల వాటు చెయ్యాలి..నర్స్..ఒక్క లైట్ వుంచి మిగతావి తీసెయ్— ఇప్పుడు తెరవండి...' అన్నాడు డాక్టర్.

జగన్నాథం కళ్ళు తెరిచాడు. రేచీకటి వున్నవాడి మాదిరిగా ఏవో నీడల్లే కనిపిస్తున్నవి.

మీరలా కళ్ళు తెరిచే ఉండండి ..నర్స్!... ఒక్కో లైటే వేసు కొనిరా—'

లైటు తర్వాత లైటు వెలగసాగింది. కాంతి పెరగసాగాక, ఒక్కోవస్తువే క్రమంగా విశిష్టరూపాన్ని దాల్చసాగింది. చివరకు లైట్లన్నీ వెలిగాక, చాలా స్పష్టంగా చూడగలుగుతున్నాడు తను!

ఎంత ఆనందం కలిగిందో అతనికే తెలియదు; ఒక్కసారిగా ఒక్క మానవుడు భరించలేనంత ఆనందం! ఆ ఉద్వేగానికి తట్టుకోలేక పొయ్యాడు. గట్టిగా కళ్ళుమూసికొని, తెరిచాడు...లేదు...,తనకు దృష్టి పోలేదు. తను చూడగలుగుతున్నాడు. కళ్ళు మూస్తూ, తెరుస్తూ ఒక నిమిషం గడిపాక లేచి కూర్చున్నాడు.

ఎదురుగుండా డాక్టర్ నవ్వుమొహం కనిపించింది. డాక్టర్ రెండు చేతుల్నీ పట్టుకొని 'డాక్టరుగారూ! నాకు బాగా కనిపిస్తోంది.. మీకు జన్మంతా కృతజ్ఞుణ్ని' అని నమస్కరించాడు.

ఆ తరువాత చుట్టూచూశాడు... మొదట జానకి కనిపించింది.. కాదు, యీమె జానకి ఐవుంటుందనుకున్నాడు.

'జానకీదేవీ!' అన్నాడు అనుమానం తీరక.

ఆమె ఒకడుగు ముందుకొచ్చింది. తన వూహ తప్పలేదు. ఈమె. ఈ జానకి ఎంత అందగత్తె! ఇప్పుడే స్వర్గంనుంచి దిగిన దేవకన్యల్లే వుంది. తనకు కళ్ళురాకుంటే ఈ సౌందర్యమంతా స్వప్నానుభూతిగానే ఉండిపొయ్యేది కదా!

...కాని యీ జానకి ఎంత సౌందర్యవతి ఐతేనేం? యీమెలో హృదయంలేదు; అది పాషాణం! యీమె మాదిరి రబ్బరు బొమ్మకూ, యీమెకూ భేదమేమీలేదు. భావశూన్యమైన భాషల్లే, చూసేందుకు తప్ప మరెందుకూ పనికిరాని తామరపువ్వల్లే వుందీమె! ఈ హృదయంలేని వ్యక్తికి తన హృదయాన్ని సమర్పించగలగటం కేవలం భ్రమ!

'నిర్మలాదేవీ!' అన్నాడు; ఆ రెండో ఆమె ముందుకు వొచ్చింది.

'మీ అందరికీ నా కృతజ్ఞత!' అని ఒక్క నమస్కారం చేశాడు. నిజానికి తనకు కళ్ళొచ్చినందుకు థియేటరులోవున్న వాళ్ళందరూ, తనతో పాటే ఆనందాన్ని సూచిస్తున్నారు.

'మీకు కళ్ళురాకముందే వీళ్ళందరూ తెలుసల్లే వుందే! ఎప్పుడూ చూడకపోయినా చప్పున సరిగా గుర్తుపట్టారు!' అన్నాడు డాక్టరు నవ్వుతూ.

ఆ ఆనందంలో నాట్యమాడబోయి చప్పున ఆగిపోయాడు. వీళ్ళు ఎంతమంది వున్నప్పటికీ, రాధాదేవిలేని లోటును తీర్చలేరు. నిజంగా తనకీ దృష్టిరావటం, ఆమె చేసిన ప్రార్థనల ఫలితమే ననిపించింది. ఆమె తన నోములపంట! ఆమె వున్నట్లయితే, తను పొందిన ఆనందమెలాటిదో ఆమెలో స్పష్టంగా చూసుకోగలిగేవాడు కదా! ప్రపంచమంతా ఒక ఎత్తూ, రాధాదేవి ఒక్కతా ఒక ఎత్తూను. ఈ తలపురాగానే కలిగిన సంతోషం సగం మాయమైంది.

థియేటరు తలుపులు తీయబడినవి. బైటికి తొంగి చూశాడు జగన్నాథం. సూర్యకాంతిని కూడా కళ్ళు తట్టుకున్నవి. వరండాలోకి వొచ్చి

పిట్టగోడమీద ఆని ఆసుపత్రి ఆవరణనంతా పరికించి చూశాడు ... తను మళ్ళీ ఈ ప్రపంచంలో పడ్డాడు; జీవితాన్ని సాగించే యోగ్యతను పొందాడు.

—కాని ఆ కలలన్నీ కరిగిపోతూన్నవి. ఇది ఇంద్రభవనం కాదు—ఆసుపత్రి. హాలులో పడుకున్న రోగుల నిట్టూర్పులూ, బాధను వెలిబుచ్చే మూలుగులూ, రోదనలూ, బాధను భరించగలిగినా, ముఖకవళికల్లో దాయలేని అశక్తతతో తన్నుకొనే ముఖభంగిమలూ, ప్రపంచంలోని విషాదాన్ని ఒక మూలకు జేర్చినట్లు తోచింది. దూరాన ప్రవహించే యమునానది, కేవలం మురుకాల్వగానే మారింది. ఈ బృందావనమంతా, కంకరరోడ్లతోనూ, అక్కడక్కడ వొత్తుగా పెరిగిన పిచ్చిచెట్లతోనూ నిండివుంది. దేవకన్యలనుకున్న వారంతా మానవమాత్రులు - కేవలం మానవులయ్యారు. వీళ్ళందరితో పాటే, దేవత్వం వొచ్చిపడిందనుకున్న తనూ మానసికంగా మానవుడు, సాధారణ మానవుడయ్యాడు!

పర్వతాగ్రంనుంచి లోయలోకి పడ్డాక, లేవలేని స్థితిలో పైకి చూసి ఎంత ఎత్తో తెలుసుకున్నప్పుడు కలిగే వికారంలాటిది ఆవరించింది. ఈ బాహ్యదృష్టి ఉండటంవల్ల, మనోనేత్రానికి చాలావరకు పని తగ్గిపోయింది. తాను ఇదివరకల్లే ఊహల్లో గాలిమేడల్ని అల్లలేడు. చూడటమే నమ్మటంగా భావిస్తాడు—అంతే! ఒకానొక దివ్యానుభూతి కలిగినట్లే కలిగి, సముద్రతరంగంవలె కరిగిపోయింది. చీకట్లో కనిపించిన అద్భుత చిత్రాలన్నీ, వెలుగులో పేలవంగా, నిర్జీవంగా, యథా రూపాలతో ప్రత్యక్షమయాయి. ఈ నిత్యజీవితమంటే వెగటేసి, ఇంతకన్న ఉన్నతమైనదేదో వున్నదనీ, దానికోసం చేతులుజాచాలని తెలిసి, జాచిన చేతులకు ఏదీ అందని అసంతృప్తితో రోజులు వెళ్ళబుచ్చుతూన్న తనకు ఆ అత్యున్నతమైనది ఊహాపథంలో మెరిసి, ఒకచోట కూడుకొని, తను నమ్మగలిగినంత శక్తివంతంగా రూపొంది, ఇప్పుడదంతా ఒక్కసారిగా పేకమేడల్లే కూలిపోయింది. మళ్ళీ ఈ సాధారణ పంచమే శరణ్యం. దీనిలోనే పోరాటాలు, గాయాలు, బాధలు, మిణుగురు పురుగుల్లే మెరిసే సౌఖ్యాలు—అవే మిగిలినవి. దృష్టి వొచ్చినందుకు ఇంతకు ముందు కలిగిన ఆనందమంతా క్షణంలో విషాదంగా మారింది...

ఏమిటి తనకీపాడు ఆలోచనలు? ఎంతగో స్వప్నమైనప్పటికీ స్వప్నాను భూతి, నిజానుభూతి ముందు తీసికట్టే కదా! స్వప్నాలతోనే సౌఖ్యపడ గలుగుతే, జీవితం ఇంత దుర్భరంగా ఎందుకుంటుంది? ఆ మిథ్య సంగతి తెలిసికూడా, తను పొరబడటంలో అర్థంలేదు. కేవలం తను తరచటంవల్ల సారమంతా అంతరించి యీ పిప్పి మిగిలింది!

—లనకు దృష్టి వొచ్చినందుకు తనకన్న ఎక్కువగా రాధాదేవి,తన ఇలవేల్పు, ఆరాధ్యదైవం జీవిత సర్వస్వమూ పొందినంత తృప్తితో ఆనం దిస్తుంది. తనకీ ప్రపంచంలో మిగతావన్నీ, తన కలలుకూడా మిథ్య అవు గాక! కాని—రాధాదేవి మాత్రం సత్యం, నిత్యం. తనకలల్ని నమ్మించి, మిగతా కలంతా కూలిపోయినా, ఆమె మాత్రం తనకు దక్కుతుంది. ఆమెను, ఆ దివ్యమంగళ విగ్రహాన్ని తానిప్పుడు చూడగలడు. ఆమె ప్రతి కదలికా తనకు ఆనందాన్నిస్తుంది. నిష్కల్మషమైన ఆమె ముగ్ధముఖంలో ప్రతిఫలించే ప్రతి ఉద్వేగాన్నీ తాను గ్రహించగలడు. యీ కళ్ళు రావటం ఆ దేవతను దర్శించి, పూజించి, తరించేందుకే ననిపించింది.

తనుగుడ్డివాడైతే రాధాదేవికి ఎంత బరువయ్యేవాడు! ఆమె భరిం చేందుకు సిద్ధంగా వున్నప్పటికీ, ప్రతి రోజూ ఆమె రెక్కల కష్టాన్ని పిండుకునే నిస్సహాయ స్థితిలోనే గడపాల్సి వుండేది. ఇది ఘోరన్యాయమే ఐనప్పటికీ, అంతకన్న దారిలేదు... తానీఅన్యాయాన్ని ఆశ్రయించకుండా తను సుఖపడుతూ, రాధాదేవిని సుఖపెడుతూ శేషజీవితాన్ని గడిపేందుకే దృష్టివొచ్చింది. రాధాదేవి సౌఖ్యాన్ని తలచుకున్నప్పుడు కాని, తాను పొందిన ఈ వరానికి తగిన విలువ చిక్కలేదు...

రాధాదేవికి టెలిగ్రాం పంపుతే...? ఆమెఎక్కడో చిన్న పల్లె టూళ్ళోవుంది. టెలిగ్రాం ఎప్పటికి జేరుతుందో? తనే బయలుదేరి వెళ్ళటం మంచిది. టెలిగ్రాంకన్న తనే ముందుగా వెళ్ళగలడు! సువార్తనివిన్నదాని కన్న, చూస్తేనే ఎక్కువ ఆనందం కలుగుతుంది. ఆమె ఆనందాన్ని కూడా, తను చూడగలడు...అబ్బ! ఎంత సుందర దృశ్యమది!

పెంపుడు తల్లినిగూడా పోగొట్టుకొని యీ విశాల విశ్వంలో ఒంటరి నైపొయ్యాననే దిగులుతో, విచారంతో, కుంగిపోతూ, నమ్ముకున్న తన ఆగి ఏమందోనని ఆతృతతో ఎదురుచూస్తూ వుంటుందామె. తనే వెళ్తే

ఆమె యీ దిగులును పూర్తిగా వొదలగొట్టగలదు. మహానదిలాటి ఆమె విస్తారం, ఆనంద సాగరంలో లీనమవుతుంది. ఆమె రాసిన రెండు ఉత్తరాలకూ తను జవాబివ్వలేదు ...పాపం! తనను మరిచిపోయి వుంటాడని అనుకుంటోందేమో? ఆమె చూపిన సానుభూతికి తనేం ప్రతిఫలం చెల్లించగలడు?

రాధాదేవిని తలుచుకుంటూన్న కొద్దీ అతను ఆతృతతో దహించుకొనిపోసాగడు. సాయంత్రందాకా బండిలేదు. రెక్కలన్నా వుంటే ఎగిరి వెళ్ళి వాలేవాడు కదా! ఊహల వేగంతో పరుగెత్తలేని కాలం, కాలం వేగంతో పరుగెత్తలేని తను— యీ వ్యత్యాసాలకు తట్టుకోలేని స్థితిలోపడ్డాడు. రాధాదేవి తనలో కలిగించిన యీ ఆవేశం నిజంగానే భరించలేనంత బలవత్తరంగా వుంది...

'మీ బెడ్ దగ్గిరికి వొస్తారా—బ్రేక్‌ఫాస్ట్ ఇస్తాను'

భావిని మింగేసిన వర్తమానం ఎదురవగానే ఊహాలు మరి సాగలేదు. జానకి నవ్వు మొహంతో ఎదురుగావుంది. జానకి! మూర్ఖురాలు! పరిస్థితులు తనకు అనుకూలిస్తే తనను అంగీకరించేందుకూ, ఎదురు తిరుగుతే విడనాడేందుకూ సిద్ధపడిన రాక్షసి! స్వార్థం లేకుండా బతకటం కష్టమే కాని, ఆ స్వార్థానికి ఇతరుల్ని బలిపెట్టినప్పుడు, ఆ యజ్ఞపశువులు పొందే ఆవేదన తనకు ఇప్పుడే తెలిసింది. జానకి విషయంలో తను పొందిన యీ ఆవేదనలాటి దాన్నే, తన కారణంగా రాధాదేవి పొందివుంటుంది. ఆమె స్వార్థత్యాగిగా, ఆ వ్యధనంతా భరించేందుకు సిద్ధపడింది. ఆమె ప్రణయంలోని పవిత్రత, నిర్మలత్వం—యీ ప్రపంచంలోనే సాధ్యమౌతుందనేది, తన దృష్టికి ఒక కట్టుకథ మాత్రం కాదు.

'ఏమిటి ఆలోచిస్తున్నారు?... రాధాదేవిని గూర్చా?' అందామె

వొళ్ళు మండిపోయింది జగన్నాధానికి. ఎదుటలేనివాళ్ళ మీద కూడా యీమె ఇలాపడి ఏడుస్తుందెందుకు? ఒకవేళ తమాషాకు అని వున్నప్పటికీ, అనాలోచితంగా, అసందర్భంగా వ్యక్తుల్ని గాయపరిచే ఉద్దేశ్యమే ఐవుండాలి., ఔను, అని చెప్పి ఆమెను నొప్పించటం, లేదా, వాద ప్రతి వాదాలకు, అవకాశం ఇవ్వటం అనవసర మనిపించింది.

'ఉహుం...ఏం లేదు... వొస్తున్నాను—పా!'

ఆమెను అనుసరించి బెడ్ దగ్గిరికి వెళ్ళాడు. బ్రేక్ ఫాస్ట్ తీసుకుంటూన్నప్పుడు జానకి ఎదురుగా కూర్చుని తన విజయాన్ని సూచిస్తున్నట్లు గర్వంగా నవ్వుతూనేవుంది. ఎంత పిచ్చిలో, భ్రమలో పడిపోతోంది దీమె అనిపించిం దతనికి. యీ విజయం తన దనుకుంటోంది ఆమె—కాదు—ఆ విధిమీదనే రాధాదేవి సాధించిన విజయ మిది! ఆ సంగతి తనొక్కడికే తెలుసు.

మధ్యాహ్నం వరకూ జానకి తన జోలికి రాకుండటం అదృష్టమే అనిపించింది. మధ్యాహ్నం భోజనమయాక 'నన్ను యీ సాయంత్రం డిస్ఛార్జ్ చేస్తారా?' అన్నాడు జగన్నాథం.

'మహారాజల్లే!...ఆనాటిరాత్రి నేను ఖచ్చితమైన జవాబు చెప్ప లేకపొయ్యాను. ఆ శేషించిన ప్రశ్నకు ఇప్పుడు జవాబు...'

ఆమె మాట పూర్తిగాకముందే 'జానకీదేవీ! మీ జవాబేమిటో నాకు తెలుసు. కనుక మీరు చెప్పనవసరం లేదు' అన్నాడు జగన్నాథం.

'అంటే...?...అర్థమేమిటి?'

ఆమె మొహం వెలవెలబోతోంది. ఊహించని అపజయమేదో ఎదురైనప్పుడు పొందే నిరాశ ఆమెను ఆవరించేందుకు సిద్ధంగావుండగా కలిగే భయం కనిపిస్తోంది.

'అర్థమేం లేదు... నేను సాయంత్రం వెళ్ళిపోతున్నాను— అంతే!

'ఐతే నా సంగతేం చేస్తారు?'

'నా స్థితి ఎటో తేలేవరకూ, నీ వెలా నిర్ణయించుకోలేకపొయ్యా వో, నేనూ నిర్ణయాన్ని చివరిదాకా దాచివుంచాను .ఇప్పుడు నీ నిర్ణయాన్ని నా నిర్ణయం ఖండిస్తోంది...'

జానకి దిమ్మెరపోయింది. ఎంతమావును నమ్ముకున్న పాంథుని స్థితిలో పడింది.

'ఇదా చివరికి మీరనేది? ఆడపిల్లను నమ్మించి, ప్రణయం జరిపి చివరకు నట్టేట్లో ముంచటమేనా? మీరు ఎగతాళిగా మాట్లాడకండి—'

'నేను చాలా సీరియస్‌గా చెప్తున్నాను. నేను నిన్ను స్వీకరించ లేను'

'ఎందుకని? నిన్న మొన్నటిదాకా మీరు చూపిన ప్రేమంతా నటనేనా?'

'కారణాలు అడగొద్దు జానకీ! జీవితంలో ఎదురయాం? విడిపోతున్నాం; బహుశా మళ్ళీ మనం ఎన్నటికీ కలుసుకోం. అందుకు విచారం లేదు...నేను నిన్ను నమ్మించి మోసంచేసిందేమీ లేదు'

'లేదా?' అందామె విచారంతో నిండిన కంఠస్వరంతో 'యీ ఉద్దేశం వున్నవాళ్ళు ఇంతదూరం ఎందుకు రానిచ్చారు? నేను నమ్మనట్లయితే, ఇప్పుడీ స్థితిలో ఎందుకు వుంటాను?'

'జానకీ! నేను నిన్ను మోసంచేయలేదని మరోసారి చెపుతున్నాను. ఆ మాటకొస్తే నీవే నన్ను మోసం చేసేందుకు సిద్ధమయావు '

'నేనా?...మీకు దృష్టివొచ్చాక మతిపోలేదు కదా?'

నిర్లక్ష్యంగా నవ్వాడతను. 'లేదు. ప్రమాదంలో దెబ్బతిన్నది కళ్ళు కాని మతికాదు. మతి దెబ్బతిన్నట్లయితే నిన్నుస్వీకరించి ఉండేవాణ్నేమో?.... నాకీ దృష్టి రానట్లయితే నన్ను నిరాకరించేదానివి కదా!అది మోసమయ్యేది కాదా?నన్ను యథాతథంగా గాక నా చుట్టూవున్న ఇతర పరిస్థితుల బాగోగులమీద ఆధారపడేటంత బలహీనమైనది నీ ప్రణయం. ఎప్పుడైతే నీవు గోడమీది పిల్లివాటానికి పడ్డావో అప్పుడే, ఆ క్షణంలోనే నిర్ణయించుకున్నాను—నీకూ నాకూ పొత్తు కుదరదని' అన్నాడు

'నన్ను కిందికి తోసేసే ఉద్దేశ్యంతోనే ఎంత ఎత్తు తీసుకెళ్ళారు! అయాచితంగా ఎన్ని ఆశలు పెట్టారు! ఎంతమంది రోగులు వొచ్చిపోవటం లేదు కనుక? మీరూ అందరి మాదిరేవుంటే నాకీ బాధ తప్పేదికదా !' అందామె ఖిన్నవదనంతో.

'అప్పుడేదో అనుకున్నాం కాని నీవుమాత్రం అనవసరంగా ఎందుకింత దూరం వొచ్చావో ఇప్పుడు చెప్పలేవు కదా! ఆ పైకంలో ఉభయులమూ పొరబడి ఉండొచ్చు. అందువల్ల మునిగిపోయిందేముంది?... జానకీ! ఒక్క శరీరసౌందర్యానికే మానవులు మూర్ఛపోవటం నిజమైనట్టయితే, అందచందాలు లేని వాళ్ళందరూ దుఃఖితులే అయేవాళ్ళు కదా!,

'ఇప్పుడీ మెట్టవేదాంతంలో పడ్డారు! ఆనాడు చెప్పిన కబుర్లకూ, యీ మాటలకూ ఏమన్నా సంబంధం వుందా!'

'మనుషులకే సంబంధం లేకుండా పోతున్నప్పుడు, మాటలకు సంబంధం ఎందుకుంటుంది జానకీ? నీ అభిప్రాయాన్ని మార్చుకునేందుకు నీకు ఎంత అవకాశం, స్వేచ్ఛా వున్నవో, నా అభిప్రాయాన్ని మార్చుకునేందుకు నాకూ అంత అవకాశం వుంది కదా!...యీ ఉద్రేకమంతా తగ్గించుకొని ప్రశాంతంగా ఆలోచిస్తే నీకే సత్యం తప్పకుండా తెలుస్తుంది.

నిశ్చలంగా నవ్వింది జానకి: 'ప్రశాంతంగా ఆలోచించాం! మీరు పోతూపోతూ నా మనశ్శాంతిని కూడా పట్టుకుపోతున్నారు. మళ్ళీ మా కులం మనిషయ్యేందుకు కొంతకాలం పడుతుంది. మీరా గాయాన్ని మాన్పుకున్నారు; నాకు గాయం కలిగించి వస్తున్నారు. మీరు నన్ను వదిలేసేందుకు, హృదయపూర్వకంగా ప్రేమించినందుకు యీ మాత్రం ప్రతిఫలమన్నా వుండొద్దా?' ఆమె సన్నగా ఏడ్వసాగింది.

తర్కించటం వల్ల యీమె చాలా బాధపడుతుంది. అందువల్ల సమాధానపడకూడదు, ఏదో తన ఆక్రోశం తీర్చుకునేందుకు, యీమె పట్ల తన ద్వేషాన్ని వెలిబుచ్చేందుకు మాత్రమే యీ సంభాషణ ఉపయోగపడుతుంది. అదిగాక అవతల రాధాదేవిని కలుసుకోగల సన్నివేశాన్ని తలుచుకుంటూంటే, యీ సంఘటన ఎంతో హేళనంగానూ, అనవసరంగానూ తనకు తోచింది. ఈమె తనను నిజంగా ఎంత ప్రేమించి వున్నప్పటికీ తాను నిస్సహాయుడుగానే వుండిపోక తప్పదు.

'జానకీదేవి! ఈ నిరాశను ఎదుర్కోగల శక్తి సామర్థ్యాలు నీకున్నవి. కాలం గడుస్తే అంతా మరచిపోవొచ్చనే సంగతి నీకు తెలుసు. ఎన్ని అపజయాల్ని ఎదుర్కొన్నప్పటికీ, జీవితాన్ని సాగించగల గుండె ధైర్యం నీకు వున్నందుకు అభినందిస్తున్నాను' అన్నాడు.

'మళ్ళీ పొగడటం సాగించారా? నేనేం మీ వెంటపడతాననీ, మిమ్మల్ని బతిమాలి భంగపడతాననీ భయపడ్డారు కాబోలు! నా పొరపాటు వల్లనే ఇదంతా జరిగిందేమో? మగవాళ్ళ మాటల్ని నమ్ముకున్న ఆడదానికి మొదటినుంచీ ఇలాటి మర్యాదలే జరిగిన సంగతి నాకు తెలుసు; ఇప్పుడు అనుభవంలోకి వచ్చింది—అంతే!' అందామె.

తన నెత్తిన పాలుపోసింది. ఈమె ఎంత తీవ్రమైన గాయానికి గురైందో, దాన్ని మాన్పటం తనకు సాధ్యమో కాదోనని భయపడ్డ

తున్నాడు. అన్నిటినీ మించి, తన కాళ్ళను చూసుకొని, ఇక్కడ రభస అవటం మొదలుపెట్టినట్లయితే, ఎంతగొడవవుతుందో! ఎలాగో తను, తప్పించుకో గలిగినప్పటికీ ఎంతమంది దృష్టిలో తను—నీచపరచ బడతాడోనని ఆలోచిస్తూన్న తనకు, అతిక్లిష్టంగా కనిపించిన ఈ చిక్కుకు, దూ ముడి దొరికినట్లయింది.

'జానకీదేవీ! మరోసారి ధన్యవాదా లందుకోండి. జీవితపు గమనంతో మీరు సరిసమానంగా పరుగెత్తగలరు. మీలాంటి వాళ్ళు ప్రపంచంలో చాలా కొద్దిమంది. తగిలిన గాయాన్నిగూర్చి విచారించటంకన్న, దాన్ని మాన్పుకునేందుకు వెంటనే ప్రయత్నించగల తెలివితేటలున్నవి మీకు. మీరు సుఖపడగలరు—తప్పక!'

జానకి మొహం కళకళ్ళాడింది. ఒకపక్క తాను ఎదుర్కొ గలిగిన అపజయం, మరోపక్క తన మనోబలాన్ని నిరూపించగలిగింది. ఈ సంగతి జగన్నాథం గ్రహించ గలుగుతాడనీ, అప్పుడు నిజంగానే అతను దిమ్మెరపోతాడనీ ఆమె అనుకున్నది అబద్ధం కాదు. తన గుండె నిబ్బరాన్ని జగన్నాథం మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

'నా సుఖాన్ని కోరిన మీకుకూడా సుఖం లభ్యమవగలదు. పరిస్థితుల్ని అనుకూలంగా తిప్పుకోగలిగిన సామర్థ్యం మీకు వుంది; అది నాకు చేతకాదు కనుక, ఇక మిగిలింది పరిస్థితులకు అనుకూలంగా మారటమే కదా!' అందామె.

'ఏదైతేనేమి—జీవించటం ఒక కళ అనుకునేట్లయితే, ఆ కళ మీకు బాగా తెలుసు...పోనీండి జానకీదేవీ! మనం మిత్రుల్లాగే విడిపోతూన్నందుకు చాలా ఆనందంగా వుంది. ఇలా హృదయాలను విప్పుకొని మాట్లాడగలుగుతే జీవితం ఎంత హాయిగా, సాఫీగా సాగుతుంది!'

'నే నీ మిత్రత్వాన్ని కూడా గుర్తుంచుకో దలచలేదు. అదంతా ఒక కల అని నన్ను నేను నమ్మించుకునేందుకు ప్రయత్నిస్తాను—అంతే!'

'కల!' అన్నాడు జగన్నాథం 'కలే! జీవితమే ఒక కల! కలలు మన ఇష్టప్రకారం ఎలారావో, జీవితంకూడా మన ఇష్టానుసారంగా నడవదు. కనుకనే అంత ఇంటరెస్ట్! మరీ అనుకోని ప్రమాదాలు వొస్తూంటే జీవితగమనమే మారుతూ, దానికొక వేగం, క్రొత్త వన్నెలూ వొచ్చి

పడుతూ, గొప్ప సస్పెన్స్‌లో పూగిపోతూ, వేగంగా సాగిపోగలుగుతున్నాం... ఇదంతా లేకపోతే జీవితం నిస్సారమే కదా!'

'సరే—జీవితాన్ని గూర్చి ఆలోచిస్తూండండి... నాకు పనివుంది—వొస్తాను మరి—' అని వెళ్ళిందామె. రాధాదేవి సంగతి ఈమెకు చెప్పుదామనుకున్నాడు కాని, అనవసరమని సరిపెట్టుకున్నాడు. చివరకు ఆ సాయంత్రం తనను సాగనంపేప్పుడు జానకీదేవి చాలా సంతోషంగా వున్నట్లే కనిపించింది. ఇంత తక్కువ వ్యవధిలో జానకి ఇంత తేలిగ్గా మారగలుగుతుందని అనుకోలేదు. ఆమె ప్రణయం బొత్తిగా బలహీనమైనదై వుంటుందా?... కాదు... మొదట్లో ఆమె తన నిరాకరణకు తల్లక్రిందులైంది; కాని వెంటనే తట్టుకుంది. ప్రతి వ్యక్తికీ ఒకోరకం వేదాంతం వుంటుంది. అదే ఆ వ్యక్తిని నడిపించేది. అలాటి వేదాంతమే జానకిని ఎప్పుడూ ఆనందంవైపే తోస్తూ వుంటుంది... జానకిలాటి వాళ్ళు ఈ ప్రపంచంలో తప్పకుండా కావాల్సింది ఏనాటికన్నా సాధించగలుగుతారు. ఒకవేళ సాధించలేకపోయినా, కుంగిపోయి విచారపడరు!

'వొస్తాను జానకీదేవీ!' అని ఆమెకు నమస్కరించాడు.

ఆమెకూడా ప్రతి నమస్కారం చేసింది.

బండి లేపిన దుమ్ములో ఒకరికొకరు కనిపించనంతవరకూ, జేబురుమాళ్ళు గాలిలో ఊగుతూనే వున్నవి.

## 10

రైలులో ఎంత ప్రయత్నించినా నిద్రరావటంలేదు. మిగతా ఇద్దరు ప్రయాణీకులూ లైట్లు ఆర్పి నిద్రిస్తున్నారు. ఒకడు గుర్రుపెడుతూ, తను నిద్రపోతున్నానని హెచ్చరిస్తున్నాడు కూడాను. వీళ్ళు ఇంత హాయిగా ఎలా నిద్రపోగలుగుతున్నారో? తనకు కలిగిన అనుభూతుల్లాటివి వీళ్ళను కథించటం లేదు కాబోలు! లేక ఆ అనుభూతులన్నిటికీ అలవడి పోయారేమో? ...ఐనా తన సంగతి ఆలోచించుకోక, వీళ్ళందరి సంగతీ ఎందుకు?

పూర్వం ఎప్పుడో, ఎక్కడో కొంతమంది మహాపురుషులు అద్భుతాలు చేశారనీ, అద్భుతాలు జరిగినవనీ అంటారు. ఇదివరకు ఇలాటి కాకమ్మకబుర్లు తను నమ్మేవాడు కాదు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఇప్పుడు

తన జీవితంలో జరిగిన ఈ సంఘటనలన్నీ అద్భుతాలు కావా? అద్భుతాల కోసం తను ఎదురు చూడలేదు, కాని అవ్వే తనను వెతుక్కుంటూ వచ్చి చుట్టుముట్టినవి.

ఒకో సంఘటనలోని 'కీడు'ను గూర్చి విచారిస్తాం కాని, ఆ కీడు వెనుకదాగిన మేలు బైటపడేవరకూ, తెలిసిరాదు. తనకు కన్నుపోవటం, మళ్ళీ రావటం! ఇంతకు మించిన అద్భుతం ఏముంది? ఆ కీడును ఆశ్రయించిన 'మేలు' రాధాదేవిరూపాన ఎదురైంది, కాదు—ఎదురై తన హృదయాన్ని అర్పించి, వరించి, తరింపజేసింది. దురదృష్టాలవలెనే అదృష్టాలు కూడా గుంపులు గుంపులుగా వొచ్చిపడుతూంటవి కాబోలు!

ఈ వొచ్చిన దృష్టి మళ్ళీ పోతుందేమో నన్నంతభయంలో నిద్ర రావటం లేదేమో ననిపించింది. ఐనా మేలుకున్నప్పటికీ చుట్టూవున్న చిమ్మ చీకటిని చీల్చుకుంటూ పొయ్యే రైలుమోత ఒక్కటే వినిపిస్తోంది. బైట కొండలే ఉన్నవో, పుట్టలే ఉన్నవో, చెట్లేఉన్నవో, దెయ్యాలు నాట్యమే చేస్తున్నవో తెలియటంలేదు. మేలుకొన్నా చూడలేని ఆ దృశ్యంలో తనను నిద్రపట్టకుండా చేయగల సామర్థ్యం ఉండేందుకు వీల్లేదు.

శరీరం విశ్రాంతి తీసుకుంటూన్నప్పటికీ, మెదడు పనిచేస్తూ తనకు నిద్రరానివ్వటంలేదు. ఔను...అదంతా తలుచుకొని తను పులకరిస్తున్నాడు. తెల్లారేప్పటికి తన స్టేషన్‌కు జేరుతాడు. అక్కణ్నుంచి ఆరు మైళ్ళు బండిమీద వెళ్తాడు. రాధాదేవి తనను చూడగానే వొచ్చి కాళ్ళమీద పడుతుంది. తనకు కళ్ళొచ్చినందుకు ఆనందాశ్రువుల్తో తన పాదాలు కడుగుతుంది. ఆ ఇలవేల్పు దర్శనంతో తను పావనమౌతాడు...

రాధాదేవి ఎలా వుంటుందో తెలియదు. ఆమె తనను గుర్తించగలదు కాని, తాను ఆమెను గుర్తించలేడు. ఐతేనేం—ఆమె కంఠస్వరం తనకు బాగా తెలుసు. కరుణాపూరితమైన ఆమె మాటలకు ఎండిపోయిన హృదయాలే చిగిరిస్తవి!

తన ఊహాపథంలోని రాధాదేవికీ, నిజమైన రాధాదేవికీ తేడా వుండొచ్చు. కాస్త కుడిఎడంగా సరిపోతారు...ఆమెను తన వెంట తీసుకొని వెళ్తాడు. ఇన్నాళ్ళూ తనను పెళ్ళిచేసుకోమని సలహాలిచ్చిన మిత్రులకు మరి శ్రమవుండదు...ఆ జీవితాన్ని తలుచుకుంటేనే ఇంత గొప్పగావుంటే—ఇక అనుభవిస్తుంటే...!

లైటు వేసి గడియారం చూశాడు. ఒంటిగంట దాటింది. అవలిం తల్ని తోసుకుంటూవొచ్చే తలపుల తాకిడి వేడి తగ్గలేదు. ఒకపక్క ఆకాశం ఎర్రబడింది. చంద్రోదయ సమయం...అలాగేచూస్తూ కూర్చు న్నాడు. చందమామ మెల్లిగా బైటపడుతున్నాడు. ఎంత చల్లగా, అం దంగా వున్నాడు! భూమిమీద పుట్టాక, మొట్ట మొదటిసారి చందమామను చూసినప్పుడు కలిగేటంత ఆనందం కలిగింది. వెన్నెల వొత్తుగా, గమ్మ త్తుగా భూమిమీదికి జారుతోంది. పోగులు కనిపించని సాలెగూడల్లే ఆవ.ం చేసింది. తెల్లారితే వుండని ఈ వెన్నెల్ని గూర్చిన దిగులుకూడా ఆరంభ మైంది. తాత్కాలికంగా వుండేవాటికే ఈ విలువలూ, ఆత్రుతాను. జీవితంకూడా తాత్కాలికం కనకనే ఎంతో 'ఇంటరెస్ట్'ను కలిగిస్తోంది. చంద్రుడు ఎప్పుడూవుంటే, వాడి మొహం చూసేవాడుండడు కదా!

—అంతేకాదు, జీవితంలోని కొన్ని వెన్నెలరాత్రులే పిచ్చెక్కి స్తవి. మరి కొన్నిటిని గూర్చి అసలు తలచనే తలచం...ఎందుకని? పిచ్చె క్కించిన వెన్నెలలోని విశేషం, తలచని వెన్నెలలోని లోపం ఏమిటి? బహుశా వెన్నెల ఎప్పుడూ ఒక్కటే! మార్పల్లా మనిషి 'మూడ్'లోనే ననేందుకు సందేహమేమిటి? భోజనం రుచి, వంటకాలమీదకన్న, ఆకలి మీదనే ఆధారపడివుండటం తనకు తెలియదా?

ఎంత విచిత్రం—ఈ చంద్రుడు! నీకు కావాలంటే ప్రకాశిం చడు, అక్కర్లేదంటే ఊరుకోడు. ఎవరేమనుకున్నా, ఎవరు అనుభవిం చనీ, మానినీ తనపని చేసుకొనిపోతాడు...ఇదే వేళ, రాధాదేవికూడా మేలుకొని ఈ చందమామను చూస్తూ, తననుగూర్చి ఆలోచిస్తూవుంటుం దేమో?...ఎందుకు కాకూడదు? తనవలెనే ఆమెకూడా చందమామను గూర్చి ఆలోచిస్తూ తనలోతాను మథనపడుతూంటుందేమో? ఒకే చంద మామ, ఇద్దరు వ్యక్తులకూ ఒకేరకం అభిప్రాయాల్నిచ్చి కలిపేందుకు ఉప యోగపడుతున్నా డనిపించింది.

రాధాదేవి స్మరణే ఇక జీవితంలో తనకు మిగిలేది. ఇంత పెద్ద జీవి తాన్ని తలచి, తాను పొందిన అమృతి మామె! ఎంతతరిచినా చివరకు మిగి లేదేమీ లేక నిరాశతోనే మట్టిలో కలిసిపోవాల్సిన దురదృష్టం తనకు దూరంగానే వుంది...రాధాదేవికూడా ఇలాగే అనుకుంటుంది...రేపు ఆమెను అడిగినప్పుడుఅంతా తెలుస్తుంది.

ఈ వెధవ రైలు చకచకా పోదేం? ఈ ఇంజన్ డ్రైవర్‌కు కూడా ఒక ప్రియురాలుండి, ఆమె ఎదురుచూస్తూ వున్నట్లయితే తెలిసేది! కాలం స్తంభించిందేమో నన్నింత ఆతృత వేధిస్తోంది. కాలాన్ని భాగాలు చేసుకొని చూస్తుంటే మరీ చిల్లరబేరం తాలూకు తులనొప్పి, కొద్దికొద్దిగా తెలియకుండానే జారిపోతోందనే భయం కలుగుతూన్నది.

జీవితం ఎంత చిత్రమైనది! జీవితాన్ని గూర్చి రాయమంటే ఒక్కొక్కరు ఒక్కొక్క అభిప్రాయాన్నిస్తారు కాబోలు! జీవితాన్ని గూర్చి ఇన్నాళ్లూ తనెన్నిసార్లు తర్కించుకొన్నాడు! రకరకాల ఆలోచనల సారంగా, ఒక అభిప్రాయం కలగటం, కొన్నాళ్ళయ్యాక మళ్ళీ మారటమూను... ఇప్పుడు జీవితాన్ని తనేమనుకుంటున్నాడు?

ఇది ఒక వ్యాపారం, బేరం లాంటిది. జీవితం చంపుతానని బెదిరించింది; తను బతిమాలుకుంటే కళ్ళు లొట్టపరుస్తానంది; మళ్ళీ తను భంగపడితే—కాదు రాధాదేవి ప్రార్థిస్తే—యీ సారికి వొదిలాను పొమ్మన్నది... అలాగే రాధాదేవిని తనకు ఇమ్మని ప్రార్థిస్తే జీవితమనే వ్యాపారి ఒప్పుకున్నాడు. ఇదే విధంగా జానకి తనను ఇమ్మని అర్థిస్తే ఇవ్వలేదు! ఇలా గీకి గీకి బేరమాడి రాధాదేవిని పొందాడు తను! జీవితం వ్యాపారం గాక మరేమిటి?

చందమామ బాగా పైకి ఎగబాకాడు. తనను చూసి నవ్వుతున్నాడనిపించింది... కాదు చందమామను చూసే తను నవ్వుతున్నాడు...అలాగే ఎంతోసేపు మేలుకున్నాక, తనకు తెలియకుండానే కునుకుపట్టింది... తెల్లారి లేచాక, తర్వాతి స్టేషనే తను దిగేదని తెలిసి అమితానందమైంది.

దిగాల్సిన స్టేషన్ రాగానే ఆతృతతో దిగాడు. తనతోపాటు చాలా కొద్దిమంది ప్రయాణీకులే దిగారు. ఆ సమీప ప్రాంతంలో ఒక ఊరున్నదనీ, అక్కడ ప్రణయదేవతావతారంలో రాధాదేవి వున్నదనే సంగతి తనొక్కడికే తెలుసు. అదీ మంచిదే—ఇలాంటి కొన్ని రహస్యాలు జీవితాన్ని నడిపించి, మురిపించి ముందుకు సాగనిస్తున్నవి. ఇలాంటి రహస్యాలే విజ్ఞానాన్ని కొద్దిమందికే దక్కేట్లుగా చేసినవి. మనిషి వ్యక్తిత్వాన్ని కాపాడుతూన్నవి కూడాను.

ముందుగా వైర్ చేసివుంటే రాధాదేవిని ఇక్కడే కలుసుకొనేవాడు కదా! తనకీ ఆతృత, దోవతెలీని పాంథుడుపడే ఆవేదన వుండేది కాదు

కదా...కాదు, తనకోసం ఆమె ఇంతపొద్దున్నే వొచ్చే శ్రమను తప్పించాడు. అసలు అనుకోకుండా నే ఆమెను కలుసుకుంటే బావుంటుంది. అంతా ముందుగా తెలుస్తే సారస్యం ఏముంటుంది కనుక ?

తను వెళ్లాల్సినవూరు ఆరుమైళ్ళు. స్టేషనుంచీ తప్ప మరేంలేదు. బైటికివొచ్చి చూస్తే అన్నాళ్లో రేపో యీ మాయ కాయాన్ని త్యజిస్తానన్న స్థితిలోవున్న గుర్రం కట్టబడిన బండి వుంది. ఒకందుకు సంతోషంగా వుంది—గుర్రానికి తగినబండి అది; బండికితగిన పీరులాంటి సాయిబు. ఇప్పుడు తనకు ఇదేదిక్కు. నడుస్తే దీనికన్న ముందువెళ్ళగలడేమో కాని దారి తెలియదాయె! అందుకని బండిని రెండు రూపాయిలకు బేరమాడి ఎక్కి కూర్చున్నాడు.

గజ ముక మైలుగా నడకసాగించింది. బండి పోయినకొద్దీ దూరం పెరుగుతోందో, తగ్గుతోందో తెలియడంలేదు. విసుక్కున్నాడు; గుర్రాన్నీ, బండివాణ్ణీకూడా తిట్టుకున్నాడు. తన తిట్లకూ, దీవెనలకూ ఫలితంలేదని తేలాక మెదలకుండా ఊరుకున్నాడు. దారంతా ఒకటే గతుకులు. గమ్యస్థానంజేరాక ఎముకలకు టంకాలు వేయవలసి వొస్తుందేమో?...ఏమైనా తను కలుసుకోబొయ్యే రాధాదేవినిగూర్చి తలుచుకుంటే యీ బాధలన్నీ ఒక లెక్క లోవి కావు.

ఎలాగో ఎనిమిదింటికి ఆ పల్లెటూరు జేరాడు. బండి ఎవరింటికి వెళ్ళాలని అడిగాడు, బండివాడు.

'రాధాదేవి...అదే...రాధ!'

'రాధ?...ఏరాధ?...ఎవరు ?

ఎవరని చెప్పగలడు తను ? ఆమె ఎవరో, ఎలా వుంటుందో తనకు తను చెప్పుకోగలడుకాని, మరొకరికి తెలియచెప్పటం ఎలా?

'అదే...ఆసుపత్రిలో నర్సుగా వుంటుందే...యీమధ్య ఆమె తల్లికూడా పోయిందే...' అని నిర్బ్యనమిలాడు జగన్నాధం.

బండివాడు కాస్త ఆలోచించి 'ఓ...రాధా...!' అని ఆశ్చర్యంగా జగన్నాధంవైపు ఎగాదిగా చూశాడు. వాడి చూపులకు అర్థం తెలియక జగన్నాధం వేరొకదిక్కు చూశాడు.

బండి సాగింది. ఇది సుందరమైన పల్లె అనుకున్న తనకు చాలా నిరాశ కలిగింది. ఎదురైన ప్రతివాళ్ళూ తనను ఎగాదిగా చూడటం,

పోలివుండటం లేదు...కాదనుకొని మళ్ళీ తన వలపు తలపుల్లోకి కొట్టుకొని పోయ్యాడు.

ఆమె వొచ్చి వొచ్చి ఈ ఇంటిముందే ఆగింది. ఎవరైవుంటారా అని ఒక్కక్షణం ఎగాదిగా చూశాడు. బహుశా రాధాదేవి దాసీదై వుండొచ్చనిపించింది.

...కాని ఆ చిరునవ్వుతో, చేతిలోని పాలగ్లాసు కిందపెడుతూ నమస్కరించింది. ఏమిటీ! ఈమె–రాధాదేవి కాదుకదా? ఒక్కక్షణంలో మనసులో రామరావణయుద్ధం ఆరంభమైంది. ఈమె రాధాదేవి ఐవుండ దని అంతరాత్మ పీకనొక్కుతున్నాడు. మరి రాధాదేవి కాకుంటే తన కెందుకు నమస్కరిస్తుంది?

'రాధాదేవి ఎక్కడున్నారు?' అన్నాడు అనుమానం తీరక.

'మీ కెదురుగా!' అందామె, తీయని కంఠంతో.

సందేహంలేదు–ఈమే రాధాదేవి! విధి తనకు ఇంత కఠిన పరీక్షను పెడతాడని ఎన్నడూ అనుకోలేదు. ఈమెను ఒక్కసారి జాగ్రత్తగా పరిశీ లించాడు.

చతురస్రమంగావున్న మొహం; చెదలుపట్టిన గోడల్లేవున్న మశూచి మచ్చలు; ఆ వ్యక్తికి సంబంధించిన ముక్కూ, చెవీ, నోరూ అతికినట్లున్నవి కాని, వాటి కొక తీరే లేనట్లు వుంది. కళ్ళల్లో జీవకళ వుంది కాని, దాన్ని మింగేస్తూన్న ముఖకళ భరించలేనిది. పొట్టిగా గున్నేనుగల్లే దొర్లుకుంటూ వొచ్చిం దీమె. తనను నూతిలోకి తోసి, మరి పైకి లేవకుండా ఈ బరువు మీద వేసేందు కేమో?

కాళ్ళకింద భూమే కంపించింది. మూర్ఛ పర్యంతమై అతికష్టంమీద నిలవ తొక్కుకున్నాడు...తన హృదయంలోని రాధాదేవికీ, ఈమెకూ ఎక్కడా పోలికలేదు. కష్టపడి ఉత్తరధృవం చేరాక, దక్షిణధృవం ఎంత దూరమో తెలిసినట్లయింది. ఈమెను – ఈ అనాకారిని తనెలా ప్రేమిం చగలిగాడు? అదంతా కలే ఐతే, తప్పకుండా అది పీడకలే ఐవుండాలి. ఆ పీడకలంతా కరిగిపోగలిగినా, నాయకీనాయకులైన తా మిద్దరూ సజీ వంగా మిగిలిపోవటమే శోచనీయం!

ఆమె దగ్గరికి వొచ్చి కదిపాక మళ్ళీ వర్తమానంలోకి పడ్డాడు.

'ఎందుకలా వొణికిపోతారు? నేనే రాధాదేవిని!... లోపలికి

రండి.—' అని చెయ్యిపట్టుకొని తీసికొని వెళ్ళింది నులకమంచంమీద కూర్చోబెట్టింది. దుర్బలునివలె, నిస్సహాయునివలె తయారైంది అతని పని! కదలలేదు. మెదలలేదు. వందల వోల్టులకరెంట్ ఇంకా శరీరంలో ప్రవహిస్తోంది.

'ఏమండీ! మాట్లాడరేం?... మీదృష్టి వొచ్చినందుకు నా కెంతో ఆనందంగా వుంది... నేను చెప్పలేదా - భగవదనుగ్రహం వుంటుందని?' అం దామె.

ఇంతకుపూర్వంకూడా ఆ భగవానుడు దయామయు డనే తనూ భ్రమపడ్డాడు. కాని ఆ దయవెనుక దాగిన ఈ నిర్దాక్షిణ్యం సంగ తేమిటి? తనకు దృష్టినిచ్చింది ఈ కురూపిని చూసేందుకా?

ఎలా అన్వయించుకోవాలన్నా కుదరకుండా వుంది. ముం దసలు మాట్లాడాలి... కాని ఏం మాట్లాడాలి? ఎలా మాట్లాడాలి? తన అంత రాత్మకే తాను జవాబు చెప్పలేకపోతున్నాడు.

ఆమె తనభుజం పట్టుకొని కదుపుతోంది. మూర్ఛిల్లటం ఒక్కటే తక్కువగా మిగతా లక్షణాలన్నీ ఆమెకు కనిపిస్తున్నవి జగన్నాథం మొహమంతా స్వేదబిందువులతో నిండిపోయింది. అగ్నిపర్వతం పగిలి వెలువడే లావా లాగుం దా చెమట! లోని తెకతెకకు ఉడికిపోతున్నాడు.

రాధాదేవి పమిటచెంగుతో మొహంతుడిచి, మంచినీళ్లు పట్టింది. ఆ తరువాత విసనకర్రతో విసరసాగాక, జగన్నాథం మళ్ళీ ఈలోకంలో పడ్డాడు.

'ఏమండీ—ఏమైందీ?... నాకు గాబరాగా వుంది... చెప్పండి. మాట్లాడండి ముందు—' అం దామె ఆతృతతో.

బాగా తెలివి వొచ్చినట్లయింది. మరొక్కసారి తన ఆరాధ్యదైవాన్ని చూడా లనుకున్నాడు. కాని వెగటేసి, షాక్ తగులుతుందేమోనన్న భయం కలిగింది. ఐనప్పటికీ చూడకుండా ఉండలేకపోయాడు. అనుమానంకొద్దీ కళ్లు నలుచుకొని మరీ చూశాడు...అదేరూపు! మానవికంగా మార్పేమైనా వుండాల్సిందేకాని, భౌతికనేత్రం చూసేదాంట్లో పొరపాటేమీ లేదని ఖచ్చితంగా తెలుస్తూనే వుంది.

రాధాదేవిలో కలిగిన సంచలనం చూస్తే జాలివేసింది. తనిలా ఎందుకు తలకిందులయ్యాడో ఎలా చెప్పడం? పాపం — ఏ మనుకుంటుందో?

'ఏమండీ _ మాట్లాడరూ ?' అంది బతిమాలుతూ.

కళ్ళుమూసుకుంటే, ఆ మాటల మాధుర్యం, ఆ వ్యక్తిత్వపు గొప్ప తనం తెలుస్తోంది. కాని తనకు దృష్టివొచ్చింది కనుక, కళ్ళుమూసుకో గల గటం కుదరదు.

'ఏంలేదు...ఏదో గుర్తొచ్చి—' అన్నాడు.

'ఉండండి—వేడికాఫీ తీసుకొస్తాను' అని ఆమె వంటింటివైపు వెళ్ళాక కాస్త వూపిరి పీల్చుకోగలిగిన ట్లనిపించింది

రాధాదేవి ఇలావుంటుందని తెలిసినట్లయితే, ఈ ఊబి నేలమీద తానీ గాలిమేడను సృష్టించుకునేవాడు కాదుకదా ! తనే కాకుండా, ఈమెనుకూడా ఎవరెస్టుశిఖరం ఎక్కించాడు. తనను నమ్ముకొని, తనను ఆధారంగా చేసుకొని ఆమె ఈ ఎత్తుకు వెళ్ళింది. త నిప్పుడు కిందికిదూకి భరాయించగలడు కాని, ఆమె...!

తలుచుకుంటే ఆశ నిరాశలమధ్య ఏర్పడిన ఈ లోయను పూడ్చ టం తనవల్ల కాదు. ఈ జీవితమంతా నిరర్థక మైన ట్లయింది. తను జీవి తంతో బేరమాడి గెలుచుకున్నా ననుకున్నాడు, ఎంత పొరపాటు ! చెల్లని నాణాన్ని గుడ్డిగా తీసుకున్నాడు—అంతే !

కనీసం జానకికుందు రాధాదేవి అందం — అంపం ! అందమనే విషయంమీద ఆలోచిస్తూంటే, రాధాదేవికి చోటెక్కడ ? హృదయ పూర్వకంగా ప్రేమించిన ఆ జానకిని కాదని, మూర్ఖునివలె హృదయాన్ని అర్పించిన ఈ రాధాదేవి దగ్గరికి వొస్తే, తన హృదయం ఇంత బరు వెక్కుతుందని ఎప్పుడూ అనుకోలేదు కదా ! అసలు వస్తువు నీడనుచూసి,ఆవస్తువు సౌందర్యాన్ని అంచనా కట్టిన ఫలిత మిది !

జానకిలాంటి సౌందర్యవతి హృదయం పాషాణం ! రాధాదేవి హృద యం నవనీతమేకాని,పైమెరుగేమీలేదు. తా నీవరకు నిజంగానే రాధాదేవి హృదయాన్నే ప్రేమించాడు, కాని ఈనాడు 'హృదయాన్ని ప్రేమించ గలగటం' అసంభవంగానూ, కేవలం మతిభ్రమణంలాగూ కనిపించింది. లోక మేదో మనను మోసం చేస్తోందని వాపోతాంగాని,మనను మనంచేసు కునే మోసంలో, లోకంచేసేదాన్ని పోలిస్తే అదొకలెక్కలోకి రాదేమో?

కాదు—విధి తనను మోసంచేసింది. రాధాదేవికూడా సమోసం చేసిందా ? కావాలని చేసివుండదు...ఏమైతేనేం తనకు తాను మోసంచేసు

కునే అవకాశాలు ఏర్పడినవి. ఐతే ఇప్పటికీ మించిపోయింది లేదు. తను మోసానికి గురికావటమా, లేక ఇతరులను — రాధాదేవిని మోసంచేసి చేతులు దులుపుకోవటమా? ఈ రెంటిలో కళ్ళున్న తనకు ఏది ఎన్నుకో దగ్గదో స్పష్టంగా కనుపిస్తూనేవుంది.

రాధాదేవిని అన్యాయంచేసి, ఒంటరిగా దిగవిడచి పొయ్యేందుకు మనస్సు అంగీకరించటం లేదు. ఒకనాడు యీ మనస్సే రాధాదేవిని మెచ్చుకుంది కదా! ఇంద్రధనుస్సులాటి యీ మనస్సును అధీనంలో ఉంచుకో గలిగిన శక్తి తనకులేదు; దాన్ని తిట్టుకున్నప్పటికీ, ద్వేషించినప్పటికీ, తన సామర్థ్యం తెలిస్తే అది ఫక్కున మొహంలో నవ్వుతుంది. దీన్ని జయించేందుకు తాను యీ జన్మలో ప్రయత్నించటంకూడా వృథాయే!

పాపం—రాధాదేవి! ఆమె రూపానికి ఆమె కారకురాలు కాదు. కావలసిన రూపమే పొందగలిగేట్లయితే ప్రపంచంలో కురూపులు ఉండేవారుకాదు; అందగాళ్ళూ వుండేవాళ్ళు కాదు! రూపానికి ఆమె బాధ్యతలేనిమాట నిజమే కాని, సౌందర్యారాధకుడుగా పెరిగిన తా నామెను ప్రియురాలిగా స్వీకరించేందుకు శక్తి లేదు. చూస్తూ చూస్తూ ఎలా గోతిలో పడగలడు? రాధాదేవికి జీవితాంతంవరకూ కృతజ్ఞుడుగా వుండగలడు. ఆమెను జీవితాంతంవరకూ పోషించనూ గలడు; భక్తితో ఆరాధించి, పూజించగలడు, ... కాని — ప్రేమించలేడు! ప్రియురాలిగా ఆమెను అంగీకరించలేడు.

యీ విషయాలన్నీ ఆమెతో చెప్పట మెలా? తను సగం చచ్చిన స్థితిలో పడ్డాడు...ఎలాటి నిరాశాసాగరంలో తను మునగానాం తేలానాంగా వున్నాడో, ఆమెను తనస్థితికే తీసికొనిరావల్సి వుంటుంది. ఈ ప్రణయపర్యవసానం, కన్నీరే నని ఎన్నడూ అనుకోలేదు కదా!

రాధాదేవి తత్వంకూడా జానకి తత్వంలాటిదే ఐతే ఎంత బాగుండు! కాదు. రాధాదేవికి సజీవహృదయం వుంది. ఆమెలో ఎంత భూతదయ, జాలి ఉన్నవో, ఆమె ప్రణయంకూడా అంతబలవత్తరంగానూ, గాఢంగానూ వుంటుంది. ఆమె మనసారా నవ్వగలదు; ఏడ్వగలదు. ఆమెహృదయం గాయపడితే, దాన్ని మాన్పేందుకు కాలచక్రంకూడా వెనుకాడుతుంది.

జానకిలాగు పదేళ్ళ జీవితాన్ని పందరోజులుగా, దుబారాగా యీమె ఖర్చుచేయలేదు. జానకి ప్రతివిషయాన్నీ పైపైన తడివి చూడ

గలదేకాని, లోతులకువెళ్ళే శ్రమకూడా తీసుకోలేదాయె. కాని రాధా దేవి యీ లోతుల్ని తెలుసుకునే తత్వం గలది. జానకి బాధనుకానీ, ఆనందాన్ని కానీ తనకుకాకుండా ఎవరికో సంబంధించినంత తేలిగ్గా అనుభవిస్తుంది. అందుకనే ఆమెలో తీవ్రమైన అనుభూతి లేదు. అంతలో తృప్తిపడగల తత్వంవున్నవాళ్ళు ఒకరకంగా సుఖపడగలరు కూడాను.

తనను బాధిస్తూన్న సమస్యల్లా ఇప్పు డేం చేయాలని! తన అయిష్టాన్ని రాధాదేవి మొహం ఎదుటనే చెప్పే సాహసం లేదు. లౌకికమార్గంలో డొంక తిరుగుడుగా చెప్పాలి. త నెంత నీచానికి వొడిగట్టాడో ఆ సంగతి రాధాదేవి ఒక్కతే గ్రహించినంతమాత్రాన ప్రమాదం ఉండబోదు కాని, ఆ విషయం తనకూ తెలుసు. తన నైచ్యాన్ని తానే భరించాలి. ఆమెను గాయపరుస్తూ, తనూ గాయపడతాడు!

విధి తనపట్ల కాఠిన్యాన్ని వహించేందుకు యీ సంఘటనను ఎందుకు ఎన్నుకోవాలి? ప్రణయాన్ని పరిపక్వదశవరకూ పెంచి, యీ ఘాతాన్ని ప్రసాదించింది. తను ఆ ప్రమాదంలో బతికి బైటపడింది—ఇప్పు డీ ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకేనా?

భౌతిక నేత్రం ఎప్పుడైతే చూడగలుగుతోందో, అప్పుడే మనో నేత్రానికి గుడ్డితనం వొచ్చిపడింది…తనలోవున్న దివ్యత్వమల్లా కళ్ళు రావటంతోనే మాయమైంది. మానవత్వమన్నా మిగిలివుండవలసింది; కాని ఒక ధృవంనుంచి, మరో ధృవానికి విసిరివేయబడినట్లుగా, రాక్షసత్వం ఒక్కటే మేలుకొనిపోయింది.

ఇంతదూరం పరుగెత్తుకొని వొచ్చినందుకు తనుతను తిట్టుకున్నాడు. తన పొరపాటుకు తను బాధపడుతూనే ఆ శిక్షనంతనూ రాధాదేవి పరం చేయక తప్పేట్లులేదు. జానకిని అంత తేలిగ్గా వొదిలించుకో గలిగాడు. కాని యీమెను విడనాడేందుకు గొంతుతెగిన సన్న జీవంవలె అంతరాత్మ ఎందుకిలా గిలగిలా కొట్టుకుటుంది?

జాగ్రత్తగా ఆలోచిస్తే జానకి పైన దేవకన్య, అంతర్యంలో రాక్షసి; రాధాదేవిపైకి రాక్షసల్లే కనిపిస్తే మాత్రమేం, అంతర్యంలో దేవత్వం వుంది…యీఇద్దర్లో ఎవర్నీ తాను వరించలేడు. ఒకచోట భౌతిక నేత్రం తృప్తిపడితే, మనోనేత్రం అంగీకరించటం లేదు; మరోచోట భౌతిక

నేత్రం అసంతృప్తితో వుంటే, మనోనేత్రం మెచ్చుకునే సావకాశం కూడా లేకుండా మూసుకొనిపోయింది...

ఎటూ తేల్చుకోకముందే ఆమె వేడికాఫీ తీసుకొచ్చింది. కప్పు చేతికి అందివ్వకుండా, అలవాటు ప్రకారమేమో, తానే తాగించింది. ఇంత ఆదరణను, కరుణను వర్షించగల వ్యక్తి తనకీ ప్రపంచంలో ఎవరున్నారు?...కాని ఇలాటి కురూపి కాకుండావుంటే రాధాదేవి శాశ్వతంగా తన హృదయాధిదేవతే అయ్యేది కదా !

కొత్త అనుమానం వొచ్చింది: రాధాదేవికి తెలియదా, తను అందగత్తె కాదని? తెలిసే ఉండొచ్చు. ఈ ప్రణయమంతా మొదలుపెట్టి, దానికి చిలవలు పలవలు కల్పించి, ఒకరమ్యహర్మ్యాన్ని నిర్మించేఉద్దేశ్యంతోనే పునాదులకు గోతులు తవ్వాడు; కాని ఆగోతుల్లోనే ఆప్రణయాన్ని పూడ్చిపెట్టి గోరీకట్టాల్సి వొస్తుందని అనుకోలేదు కదా ! అంతా తనమీదుగా తిరగబట్టి ఆమె తన అందచందాల్ని గూర్చి ఆలోచించి వుండదు. ఆ నాడు హృదయపూర్వకమైన పవిత్ర ప్రణయమే, ఈ నాడు నీచాతి నీచమైన దేహసౌందర్యాన్ని కాక్షించి, కామరూపానికి మారింది. తనేమీ చేయలేని అశక్తతతో బాధపడుతున్నాడు.

ఈ ప్రదేశంలో మరి నిలుపలేడు; ఒకపక్క ఆమె రూపానికి బాధపడుతూ, తాను చూపే ఏవగింపును కూడ గమనించకుండానే తనమీద అనురాగసుధను వెదజల్లుతుందీమె! ఈ రెండు అనుభూతుల మధ్యా నలిగిపోతున్నాడు. ఏదో వొక సాకుమీద బైటపడటం మంచిదనిపించింది. చెప్పే సాకు కారణంగా ఆమెకు తనమీద ఆశవుండటం చిత్రవధలాటిది. కనుక కష్టమో, సుఖమో ఎదుర్కోవటమే మంచిది.

'రాధాదేవీ!...నేను వెళ్ళిపోతున్నాను' అన్నాడు, ఆమె మొహంలోకి చూసే ధైర్యంలేక.

'ఇప్పుడే కదా వొచ్చింది; అప్పుడే వెళ్ళిపోతాననంటా రేమిటి?... నన్ను మరిచిపోయ్యారేమో ననుకున్నాను సుమండీ!' అందామె.

మరచిపోయినట్లయితే ఇంతబాధ వుండేది కాదు; తానూ, రాధాదేవీకూడా బతికి బైటపడేవాళ్ళు.

'మీ రిక్కడ ఇంకా వారంరోజులన్నా ఉండాలి. నా ఆతిథ్యాన్ని కాదనకండి.'

శాశ్వతంగానే రాధాదేవి సమక్షంలో ఉండాలని వుంది, కాని ఎట్లా? ఏదేవత కరుణించి, రాధాదేవికి సుందరరూపాన్ని ఇవ్వగలదు? లేక తన మనసు మార్చగలదు? తన కా దేవత్వం చాలా దూరమైపోయింది.

'వొచ్చినప్పట్నుంచీ అన్యమనస్కంగానే వున్నారు. కళ్ళొచ్చిన సంతోషమే లేదు. మిమ్మల్ని చూస్తుంటే నా ఉత్సాహంకూడా తగ్గిపోయింది—'

ఎంత అమాయకురా లీమె! కళ్ళు వొచ్చినప్పుడు తనెంతో సంతోషపడ్డాడు! ఇకముందుకూడా తను గుడ్డివాడు కాదని ఆనందించవొచ్చు; గుడ్డివాళ్ళను చూసినవ్వనూ వొచ్చు... కాని తన యీ చూపు జీవితానికే ఘోరమైన శాపుగా పరిణమించింది. తనలోని ఉత్సాహాన్ని చూసుకోని, తన ఉత్సాహాన్ని తగ్గించుకున్న పిచ్చిపిల్ల! యీ నిరపరాధిని ఎలా శిక్షించగలడు? ఆమె ఆశలన్నిటినీ ఒక్కసారిగా ఎలా నీట కలపగలడు? ఇప్పుడు సందర్భాన్ని అనుసరించి ఆమెను అన్యాయంచేసి తను బైటపడినప్పటికీ, తన యీ నైచ్యం జీవితమంతా తనను వెన్నాడుతుంది; యీ కల్మషాత్మమ తను భరించాల్సిందే! ఆ సంగతి తెలిసే కావాలని తను పొరబడుతున్నాడు.

రాధాదేవి ఎంత సుగుణరాశి ఐతేనేం గాక, తనకు అతీతురాలే! చందమామ ఎంత అందమైనదైనా, దానిలోని మచ్చకే ఆ ప్రాధాన్యం, గురిగింజలోని ఎరుపుభాగం, నలుపుభాగాన్ని ఎంత మింగేయగలిగినా, దాని నలుపును గూర్చే చర్చిస్తాం కదా! గులాబి ఎంత సువాసనతో, అందంగా వున్నా, దాని ముళ్ళసంగతి పట్టించుకోకుండా ఉండలేం కదా...యీ వాతావరణంలో పెరిగిన తను, ఒక్కసారిగా రెక్కలుంటేనే కాని పైకి ఎగరలేడు.

'మీ రేపో చాలాదీర్ఘంగా ఆలోచిస్తున్నారు...చాలా బాధపడుతున్నారు కూడాను...ఏమిటో నాతో చెప్పరా?' అందామె, నేలమీద కూర్చొని, ప్రాధేయపడే ధోరణిలో.

తనిం కెవరితో చెప్పుకుంటాడు? ఆ విధికి చెప్పుకున్నా వినదు. తనకు తను చెప్పుకోవటమూ ఐంది. ఇంక మిగిలిందల్లా యీమెకు చెప్పటమే!

'రాధాదేవీ!' అన్నాడు చెప్పేమాటలు ఎవరివో ననే ధోరణిలో 'నీవేం చేయదలచుకున్నావ్?'

ఆమె నవ్వి అంది : 'వంట చెయ్యదలచుకున్నాను'

ఆ వ్యథలోనే తనూ నవ్వాడు. తనను నవ్వించి కవ్వించగల దీమె! కాని అకర్షించలేదు. ఏం చేసుకోగలడు యీ సుగుణాలను? విధి అన్నిటినీ ఒక్కచోట జేర్చదు కదా? సృష్టిలోని యీ లోపాన్ని పూరించేందుకు కళాకారులు నానా అవస్థా పడుతున్నారేమో? కాని ఆ 'కళ' లోపించిన తన జీవితం ఎంత భారంగా, ఘోరంగా తయారైంది!

'రాధాదేవీ!... నేను అడిగేది అదికాదు...నీ భావిజీవితాన్ని గూర్చి —' అన్నాడు వొణికిపోయే కంఠంతో.

ఆమె ముఖంలో ఆశ్చర్యం కనిపించింది. ఇదివరకే జరిగిన నిర్ణయం భూకంపంవల్ల నెర్ర లిచ్చిన భూమివలె ఐనట్లయింది.

'ఇక్కడ పను లింకా వారం పట్టొచ్చు...' అందామె 'తరువాత —?' అని అతని ముఖంకేసి చూసింది.

'తరువాత—?' అన్నాడు అతను, ఆతృతతో.

'తరువాత...మీరే వున్నారు!'

ఆమెకు తను ఎప్పుడూ వుంటాడు; కాని తన కామె ఏమీ కాదా? మనసులోమాత్రమే ఉండిపొయ్యే ఒకానొక దివ్యానుభవం తాలూకు మధురమైన తలపు తళుకుమాత్రమేనా?

'రాధాదేవీ! ... నా సంగతి వొదిలెయ్' అన్నాడు ఎలాగో. మాటలు వెతుక్కోవాల్సివొస్తోంది.

ఆమె నిశ్చేష్టురాలయింది; మెల్లిగా తేరుకొని అతనిముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది. కొంత అర్థమైవుండొచ్చు. మిగతాది తేలిగ్గా వూహించిఉండనూవొచ్చు. ఆమె జవాబు చెప్పలేక పమిటచెంగుచాటున ఏడ్వసాగింది.

'రాధాదేవీ!' అన్నాడుతలమీద నిమురుతూ 'ఎందుకుఏడుస్తావ్?.... చెప్పు...నాకు చెప్పవా?' బతిమాలాడు.

'యీ సంగతి చెప్పేందుకేనా మీరు ఇంతదూరం వొచ్చింది?... ఒక కార్డుముక్క రాస్తే సరిపొయ్యేది కదా?' అందామె.

యీమెను చూశాకకదా, తన నిశ్చయాలన్నీ పటాపంచలైంది. కన్నుమూసి కన్నుతెరిచేలోగానే ఎన్ని విపరీతాలు జరిగినవి; యీ ఇంద్ర

జాలం వల్లనే అంతా తలక్రిందులైంది. జీవితంకన్న ఇంద్రజాలం ఇంకెక్కడ వుంది?

నేనేం చెప్పేనని రాధాదేవీ ?—'

'నాకామాత్రం అర్థం కాలేదనుకున్నారా ? నాకు తెలుసు—నేను అందకత్తెను కాదు. కురూపినే ! కాని మీరు సహృదయులని, మానవులని అనుకున్నాను. మీ మాటలు నమ్మాను. నమ్మినందుకే చెడ్డాను. . .పోనీండి నేను మీకు తగను. ఆ సంగతి నేనే చెప్పగలను. . . కాని నాకు మీపట్ల కలిగిన అనురాగమంతా, మీరు కల్పించిందే ! నా వూహలకు రెక్కలిచ్చారు, నా ఆశలకు సౌధాల్ని కట్టారు. ఆ ఇచ్చినవన్నీ యీనాడు లాక్కుంటున్నారు; అవి మీఆస్తి పాస్తులే కనుక మీవి మీరు తీసుకెళ్ళటం న్యాయం...నన్ను నన్నుగా మిగిల్చారు—'

తనకు, ఇంతహాని చేసిన తనను బాధించటమన్నా తెలియదేం? కఠిన మైన పదాలే యీమెకు తెలియవేమో ? హృదయం ఎంత సున్నితమైందో, మాటలుకూడా అంత మెత్తనివే ! వరమీయని వేల్పుమీద అలిగి పూలతో కొట్టాలని ప్రయత్నించే పిచ్చిభక్తురాలివలె వుంది...తనకు జాలికలుగుతోంది; కాని యీ జాలి అనురాగంగా మారేందుకు యీ ప్రపంచంలో ఏదైనా మార్గమున్నప్పటికీ, అది తనకు ప్రస్తుతం అందుబాటులోలేదు.

'రాధాదేవీ !... నేను పొరబడ్డాను—'

'ఔను. నావల్లనే పొరబడ్డారు...కాని యీ అంద చందాలను నేను కోరి తెచ్చుకోలేదు. మీరే జీవిత సర్వస్వమని నమ్ముకొన్నాను. మీరు చూపిన అనురాగంముందు, నేనుచూపేది చాలా అల్ప మనిపించి. దప్పుడు...కాని నాలో యీ అనురాగమే కలగనట్లయితే, ఇది ఫలించ లేదనే బాధవుండేదికాదు. కొండమీది కెక్కించి, సుందరమైన దృశ్యాన్ని చూపించింది,ఆకొండమీదినుంచి కిందికి తోసేందుకేనని ఇప్పుడుఅర్థమైంది_ం

తనలోని విరుద్ధశక్తుల సంఘర్షణలో ఉచ్చాన్ని నీచం జయించిందని ఎలా చెప్పగలడు ? నీచమని తెలిసీ మనంచేసే, చేసితీరవలసిన అనేక పనుల్లో ఇదీ వొకటి. అరు నూరుకానీ రాధాదేవిని తను స్వీకరించలేడు. న్యాయాన్యాయ విచక్షణ లేక కాదు. ఆమెది న్యాయమే కావొచ్చు, కాని దాన్ని అమలుజరపటమంటే, తనకు తాను అన్యాయం చేసుకోవటమే కదా !

'రాధాదేవీ ! ఇప్పుడు నేనేమీ చెప్పగునే స్థితిలో కూడాలేను. నా తప్పులన్నిటినీ క్షమించగల విశాలహృదయం నీకు వున్నదనేనమ్మకం వుంది'

ఆమె నవ్వింది; జీవితంలోని విషాదాన్ని మాటల్లో, కంఠస్వరంలో జోడించింది.

'క్షమించటమా ?' అందామె 'ఎంత తేలిక ! గాయపడిన హృదయాలనుంచి క్షమాభిక్షను యాచించటం యీనాడు క్రొత్తకాదు. ఐనా మీరేం తప్పుచేశారని ? నేనే పొరబడ్డాను; నేను తవ్వుకున్న గోతిలో నే పడ్డాను—'

'రాధాదేవీ ! నీవు సుఖపడాలనే నేను కోరుతున్నాను. నీకు డబ్బిస్తాను...డబ్బుతో ప్రపంచంలో చాలా సుఖపడొచ్చు—'

ఆమె మండిపడింది. ఆమె మాటలకు అగ్నిశిఖలే జోడించబడుతవని తనెన్నడూ అనుకోలేదు.

'ఔను...ప్రపంచంలో డబ్బుకు అన్నీ దొరుకుతవి. మానవులు, మానవ హృదయాలు, అనురాగాలు, ఆపేక్షలు అన్నీ లభ్యమౌతవి... అందులోనూ నేను మిమ్మ ప్రేమించానంటే, మీ డబ్బుచూసి...ఇవ్వాళ ఎలా అనగలుగుతున్నారీ మాటలు? వేశ్యలు శరీరాల్ని అమ్ముకుంటారు; కాని నేను హృదయాన్నికూడా అమ్ముకునేటంత నీచురాలికింద కట్టారు...నా యీ విలువను తెలియ జెప్పేటందుకు ఎంత శ్రమ తీసుకున్నారు !'

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. సూర్యరశ్మికి కరిగే మంచుగడ్డకూ తన హృదయానికీ తేడాలేదు. కాని, మరోపక్క ప్రపంచంమూపే ఆశలకు, తనకోరకై వేచివున్న సౌఖ్యాలకు, కళాపూరితమైన మనస్సు కాంక్షించే సౌందర్యానికి లొంగిపొయ్యాడు. యీమె తనను తీవ్రంగా గాయపరిచినా బాగుండు; అందువల్లనే నిరాకరించాననే ఆత్మతృప్తన్నా మిగిలేది.

'మీరింకా ఇక్కడే వున్నారా?' అందామె 'మీరు వెళ్ళిపొండి. మీరిక్కడ ఉన్నంతసేపూ నేను మొహం ఎత్తలేను. అనవసరంగా మీరు బాధపడతారు, నన్ను బాధ పెడతారెందుకు ?...నాకు మీ డబ్బు అక్కర్లేదు. నేను బతకగలను...వెళ్ళండి—'

జగన్నాధం తన ప్రయత్నం లేకుండానే లేచి నిలబడ్డాడు. కాళ్ళు వొణుకుతూన్నవి. చేయకూడనిపని చేసేప్పుడు కలిగే కంపరం ఆరంభమైంది. కాని చేయక తప్పదనే అంతరాత్మ ఆజ్ఞ గదమాయిస్తోంది.

'వెళ్ళరా మీరు ? నేను బతకటమన్నా మీకు ఇష్టం లేదా ?' అందామె.

ఒక్కసారి ఆ పరిసరాలన్నిటినీ కలయచూచాడు. తను కాదన్నట్లుగానే ఎలాగో బైటపడ్డాడు. ఏమీ తెలియటంలేదు. కాని శరీరాంగాలు మాత్రం తమ జాగ్రతల్ని తీసుకొని జగన్నాథాన్ని రోడ్డెక్కించినవి.

స్టేషన్ చాలా దూరమనే ఆలోచనేలేదు. కాళ్లు ముందుకు సాచుతున్నది. కాని మనసంతా రాధాదేవి కుటీరాన్నే పట్టుకొని వేళ్ళాడుతోంది. దాన్నికూడా బలంగా లాగేందుకు కాళ్ళల్లో సత్తువలేదు. కాళ్ళ కింద రోడ్డు జరిగిపోతోంది. అలా ఎంతసేపు నడిచాడో తెలియదు... ఎండ తీవ్రంగావుంది. చాలా అలసటగాకూడా వుంది. ఒకచెట్టుకింద కూలబడ్డాడు.

సేద దీర్చుకుంటూండగా తిరిగి రేగిన ఆలోచనలు ఒక్కుమ్మడిగా మీద పడినట్లయినవి...భూతకాలంలోనుంచి తెంచుకొని వర్తమానంలోకి వడ్డాడు.

'ఒరేయ్ ! నీచుడా !'

అదిరిపోయి చుట్టూ చూశాడు. ఎవ్వరూలేరు. యీ శబ్దాలు తనలోనుంచి, అంతరాత్మ పలుకుతోంది.

'ఇంతకన్న దురన్యాయం వుందా ? నిజంగా నీకు కృతజ్ఞత అంటే తెలుసా ? రాధాదేవిముందు జానకి అల్పత్వాన్ని గ్రహించా ననుకున్నావే-అదంతా మరచిపోయ్యావా ? నీకు ఏ ఆత్మ బంధువు రాధాదేవికన్న ఎక్కువ అనురాగంతో సేవచేస్తుంది?...నీ కొరకై ఆమె దేవుణ్ని సైతం ప్రార్థించి, కరగించి, వరం తెచ్చింది. నీకు కళ్ళు రాకుంటే ఆ జానకి నిరాకరించివుండేది కదా—కాని రాధాదేవి నీకు అండగా జీవితమంతా గడిపేందుకు సిద్ధపడింది. జానకి పరిస్థితుల్నిబట్టి, తన సుఖానికి అనుకూలంగా మారేతత్వం గలదనేకదా ఆమెను ద్వేషించింది. ఇప్పుడు నీవు జానకికన్న అధికుడివి ఎలా అయ్యావు ? ఏ దుర్గుణాలనైతే ఇతరులలోచూసి అసహ్యించుకుంటున్నావో, ఆవే దుర్గుణాలు నీలో వున్నప్పుడు వాటిని ద్వేషించవు సరికదా, అంగీకరించి వాటికి లొంగి, ఆరాధిస్తున్నావు. ఇంతకన్నా దారుణం, ఘోరం వుందా ?'

జగన్నాథం కొయ్యబారిపొయ్యాడు. తన అంతరాత్మ తనమీదనే తిరుగుబాటుచేస్తోంది. దాని శక్తికి తట్టుకోలేదు. బైటినుంచి వొచ్చే విప్లవాలను ఎదుర్కోగలడేమో కాని, తనలోనే జరిగే సంఘర్షణనుంచి దూసుకోవటం ఎట్లా ?

'ఆలోచించు—' అంది అంతరాత్మ 'ఆ ఉద్వేగమంతా తగ్గింది కనుక ఇప్పుడు రెండోవైపుచూడు. నీకు దృష్టి రానట్లయితే ఏమయ్యేది ? అప్పుడు రాధాదేవి కూడా నిన్ను నిరాకరించివుంటే ఏమయ్యేవాడివి ?... అనవసరంగా ఆమెను మబ్బుల్లోకి లాక్కువెళ్ళి, ఆమెను అక్కడే వొదిలి, నీవు చాటుగా, పిరికిపందవలె తిరిగివొచ్చావ్. నీలాగే తన సుఖం తాను చూసుకోగల జాణకాదు రాధాదేవి. నీలోవున్న నైచ్యమే ఆమెలోనూ వుంటే ఇంత బాధపడేదికాదు. నీకు కళ్ళొచ్చినవంటే, వాటితోచూసి, న్యాయా న్యాయాల్ని తూచేందుకు. అంతేకాని చూడగలవు కనుక, చూస్తూ చూస్తూనే ఎంత ఘోరానికైనా తలపడమనా ?'

జగన్నాథానికి బుర్ర తిరిగిపోతోంది. యీ అంతరాత్మ ఇప్పుడు ఘోషించినట్లు, ఇంతకుముందు ఎందుకు యుద్ధారంభం చేయలేదు ?

'ఇంతసేపు ఏమయ్యావ్ ?' అన్నాడు.

'ఏమయ్యాను—నీలోనే వున్నాను. గుడ్డివాడల్లే ప్రవర్తిస్తున్ననిన్ను చూస్తున్నాను. అప్పుడే మాట్లాడాలనుకున్నాను; హెచ్చరిద్దామనుకున్నాను...కాని నన్ను నోరు కదపనిచ్చావా ? నా గొంతు పిసికావు... ఇప్పుడు నీలోశక్తి తగ్గింది కనుక, నీపట్టు విడింది...అందుకనే కాచివడపోసిన సత్యాన్ని వెడలగ్రక్కుతున్నాను. యీ సత్యం చేదుగానే వుంటుంది. ఐతే వ్యాధికి దివ్యౌషధంలాంటి దిది...నీవు మళ్ళీ నా గొంతు పిసికేసేదాకా, నేను మాట్లాడుతూనే వుంటాను.'

జగన్నాథం చాలా సిగ్గుపడ్డాడు. తన అంతరాత్మకే ద్రోహం తలపెట్టాడు; ఇంకానయం—అది చావలేదు ! దాని వాక్కుల ఫలితంగా తనలో తిరిగి మానవత్వం ప్రవాహంవలె వొచ్చిపడుతోంది.

కళ్ళు మూసుకున్నాడు; మళ్ళీ ఆ బృందావనం, యమునాతీరం, రాధాదేవి దివ్యసౌందర్యం అన్నీ మనఃఫలకంలో మెరిసినవి. గుడ్డితనంలో అందుకోగలిగిన యీ మహోన్నత శిఖరాలు, కళ్ళుతెరిస్తే కఃగిపోతున్నవి. తను నిజంగా గుడ్డివాడుగానేవుంటే ఎంత బాగుండేది !...రాధాదేవి.

తనను ఆరాధించేది; తానామెను కొలిచేవాడు. దివ్యప్రణయం ఉభయుల్నీ కలిపివుంచేది కాదా! ఇప్పుడు చేసిన యీ అన్యాయం రాధాదేవికే కాదు; తనకు తానూ చేసుకున్నాడు!

క్షణికమైన భౌతిక సౌందర్యంకోసం తనెందుకింత తహతహపడ్డాడు? రాధాదేవిలాటి రత్నాన్ని దిగవిడిచి, ఇక్కడ యీ దుమ్ములో గాజుపెంకులకోసం వెతకటం దేనికి? తనకీ కళ్ళు వొచ్చినందుకు తనుపడే పొరపాటుగాక మరేమిటి? గులాబికి ముళ్ళున్నవని దాన్ని ద్వేషిస్తున్నామా? చందమామలో మచ్చవున్నదని దాన్ని మెచ్చుకోకుండా వూరుకుంటున్నామా?...ఇంతదూరం వొచ్చాకకాని తనుచేసిన నేరం తెలియలేదు. జీవితంలో పొరపాటుచేసి, దాన్ని దిద్దుకునే అవకాశం లేకుండా ముందుకు సాగిపోవటమే జరుగుతోంది. కాని అదృష్టవశాత్తూ ఇప్పుడు తను వెనక్కు నడిచి, ఆ పొరపాటును సరిదిద్దుకోగలడు.

పాపం—రాధాదేవి ఎంత తపనపడుతుందో? ఆ అమాయకురాలి మీద తనకు నిజంగా ఎంతో జాలికలిగింది. ఆ జాలిని అనురాగంగా మార్చగలిగిన సమర్థతవున్న సజీవ అంతరాత్మ తనలో వుంది. ఇంతకన్న తనకింకేం కావాలి!

'ఇంకా చూస్తావేం—లే...వెళ్ళి రాధాదేవి కాళ్ళమీదపడి, ఆమె క్షమను అర్థించి, సాధించి, స్వీకరించు. ఇంకా ఆలస్యంచేస్తే యీ అవకాశం కూడా పోతుందీ—' అని హెచ్చరించింది అంతరాత్మ.

కొత్తశక్తులేవో శరీరంలో ప్రవేశించినవి. ఎంతో ఉత్సాహంతో తిరిగి గ్రామంవైపు నడవసాగాడు.

జీవితం ఎంత విచిత్రమైనది! రాధాదేవిని స్వీకరిస్తే తన జీవితం ప్రమాదానికి లోనవుతుందనే పిచ్చివూహ భ్రమింపచేసింది కాని, తను కోరని, కనీసం వూహించని ప్రమాదాలు ఎదురవుతూంటే తనేం చేయగలడు? ఆ ప్రమాదాలు వాటంతటవే సర్దుకున్నవి. సర్దుకోకపోయినా నామమాత్రంగా తను అనుభవించే తీరవలసివుండేది కదా!

ఒక్కొకళ్ళు తెలిసివుండీ యీ జీవితాన్ని వృధాగా చాలా స్వల్ప విషయాలనుకూడా రిస్కు చేయటం తనకు తెలుసు. గంటలతరబడి రైలులో కూర్చొని, తను దిగవలసిన స్టేషన్‌లో బండి ఆగుతూండగానే దిగి, రైలుకిందపడి చచ్చినవాళ్ళను తను ఎరుగు! ఒక్క నిమిషం ఆగలేక,

నిండు ప్రాణాన్నే రిస్క్ చేసిన మనుషులు ! వాళ్ళా నిమిషంలో సాధించేదే మీ లేదు. అదంతా తెలిసే తృణప్రాయంగా ప్రాణాన్ని బలిపెట్టారు.

కాని తనుచేసే ఈ 'రిస్క్'కు అర్థంవుంది. రాధాదేవి అందంతో కాకున్నా, హృదయంతో తనను సుఖపెట్టగలదు. ఈమె తనను అర్థం చేసుకోగలిగిన వ్యక్తి. అందమంటే ఏదో తను మనస్సులో వూహించు కునేదే కాని, దీనికి కొలతపాత్ర ఎక్కడ? అలాటిది ఎక్కడన్నా వున్నదను కుంటే అందాన్నిగూర్చిన వివిధాభిప్రాయాలు ఎందుకుంటవి ?...ఇప్పుడు రాధాదేవి సౌందర్యం తనకు అసంతృప్తిగా వున్నప్పటికీ, తనుమారగలడు; తప్పక మారుతాడు ! ఆ మార్పును తీసుకొనిరాగల సామర్థ్యం రాధాదేవికి వుంది. ఇప్పుడు మారలేదా ?

ఇంకానయం. క్షణంలోఅంతా తలక్రిందులయ్యేది చీకటి-వెలుగుల మధ్యవున్న ఆ సన్నని చార, జీవన్మరణాల మధ్యవున్న ఆ క్షణమో, అందు లోని భాగమో, సత్యాసత్యాల మధ్యవున్న కనపడీ కనపడని సరిహద్దుగీత- వీటన్నిటినీ తానిప్పుడు చూడగలుగుతున్నాడు. ఎటు కాస్తతూలినా ప్రమా దమేకదా ! ఆ తూలటం వెంటనే నిలతొక్కుకోవటం జరిగింది.

మనసు వర్తమానంమీదినుంచి భావిమీదికి దూకింది. తిరిగి ఆ దాం పత్యం, స్వర్గసౌఖ్యం, ఇల్లు వాకిలి మొదలైనవన్నీ కళ్ళముందు మెరిసినవి. తాను వూహించి, అసంభవమనుకున్న ఆ భావిజీవితానికి తిరిగి పునాదులు పడి, క్షణంలో రమ్య హర్మ్యం తయారైంది. ఇలాటి మనసును వుంచు కొని, తనెందుకు భయపడటం ?

మానవుడు విచిత్రవ్యక్తి. సాధువైన జంతువుల్నే చంపితింటాడు. వన్యమృగాల మాంసం రుచిలేదనికాదు, దానిరుచి తెలుసుకునే ప్రయ త్నంలో, తన మాంసంరుచినే అవి తెలుసుకుంటవేమోనని భయం !... అదేవిధంగా ఈ రాధాదేవిని, సాధుజీవిని తను నెత్తురుచుక్కకూడా కనిపించకుండా హత్యచేసేందుకు ప్రయత్నించాడు...కాదు, ఆ దుర్ఘటన పూర్తిగాకముందే సరిదిద్దుకోబోతున్నాడు.

ఊళ్ళో ప్రవేశించాడు. రాధాదేవి దగ్గిర వాలుదామనే ఆతృత కలి గించే ఉత్సాహం తనకాళ్ళను చకచకా నడిపిస్తూంది............

అల్లంతదూరాన వుండగానే వీధిచివర ఇల్లేదో తగలబడుతోంది. అగ్ని శిఖలు పైపైకి పాకుతున్నవి. దట్టంగా పొగ కమ్ముకుంటోంది.

గాలికి ఎగిరివొచ్చే బూడిద అన్నివైపులకూ పయనిస్తోంది. వాసాలు కాలి చిటికిన చప్పుళ్ళు వినిపిస్తున్నని...రాధాదేవిఇల్లు కాదుకదా !

ఈ తలపురాగానే జగన్నాధం పరుగెత్తసాగాడు. దగ్గిరవుతున్న కొద్దీ, రాధాదేవిఇల్లే నని నిశ్చయమైంది. ఒకపక్క కంపరం ఆరంభమైంది. నిజానికి అభయంలో కాళ్ళాడకుండవలసింది: కాని ఆ భయమే అతనికి శరవేగాన్నిచ్చింది, రాధాదేవి ఏమైందోననే భయ మది. మృత్యుదేవత వెంటాడినప్పుడు పరుగెత్తే వేగమది !

ఇంటిచుట్టూ చాలామంది జనం పోగైవున్నారు. కొంతమంది కుండల్తో నీళ్ళు పోస్తున్నారు. వాళ్ళశ్రమ తగ్గించేందుకు అగ్నిదేవుడు దాదాపు తనపనిని పూర్తిచేసుకున్నాడు. ఆ సెగకు బయపడి, దూరదూరానికి జరుగుతున్నారు, ప్రేక్షకులు.

జగన్నాధం ప్రాణంవలెదూసుకొని జనంలోనుంచిముందుకొచ్చాడు.

'రాధాదేవి......రాధాదేవి......ఎక్కడ ?' అన్నాడు, ఊపిరి అడటంలేదు. ఆయాసంతో రొప్పుతున్నాడు.

'పాపం !...ఆ లోపలే ఉండిపోయింది'

కళ్ళముందు ప్రళయమే కనిపించింది. జగన్నాధం ఆలోచించే స్థితిలోలేడు...ముందు, తన రాధాదేవిని, ఆరాధ్యదైవాన్ని రక్షిద్దామనే పిచ్చిభ్రమతో దూకుతున్నాడు ఇదిచూసి ఇద్దరు ముగ్గురొచ్చి, గట్టిగా, కదలకుండా జగన్నాధాన్ని పట్టుకున్నారు.

వాళ్ళచేతుల్ను వొదిలించుకునేందుకు గుంజుకుంటూ 'వొదలండి... నన్నొదలండి...రాధాదేవీ!...' అని ఎలుగెత్తి అరిచాడు.

'బాబూ! లాభంలేదు......ఆమెను రక్షిద్దామని మేమెంతో ప్రయత్నించాం......బూడిదైపోయింది' అని వాళ్ళు ఆపేందుకు ప్రయత్నించారు.

'పాపం ! ఎంతమంచిది !' అన్నారు ఎవరో.

ఆమె మంచితనం తనకన్న బాగా తెలిసినవాళ్ళీ ప్రపంచంలోలేరు. రాధాదేవి భౌతికశరీరం కళ్ళముందే బూడిదయింది; ఆమె ఆత్మ పొగరూపాన ఎగిరిపోతోంది. నిండుప్రాణం తనకు బలయింది ! ఇది హత్యైనప్పటికీ తాను నేరస్థుడుకాడు ! ఇంతకన్న ఘోరాన్ని తా నసలు వూహించగలడా ? ఆమె తనకు ప్రాణాన్నిచ్చింది, ప్రతిఫలంగా తాను

ఆమెకు మృత్యువును ప్రసాదించాడు. తనలోని మట్టిని బంగారం చేసిందామె; ఆమెలోని బంగారాన్ని మట్టిచేశాడు తాను! ఇక ఆమె వికృత శరీరం తనకు కనిపించదు. దాంతోపాటే దివ్యత్వమున్న ఆత్మకూడా శాశ్వతంగా ఈలోకంనుంచి విరమించింది... ఈ కొద్ది కాలవ్యవధీ, తన జీవిత పరిణామాన్ని ఎన్నింతలు పెంచి, ఎంతభారాన్ని కొని తెగలిగింది!

'భగవాన్!' అనుకున్నాడు జగన్నాథం 'నాకు కళ్ళెందుకిచ్చావు? కళ్ళు లేనప్పుడే నేను సత్యాన్ని చూడగలిగాను. కళ్లువుంటే చూసేదంతా ఈ మిథ్య! ఈ ఘోరాన్ని చూసేందుకేనా నాకు దృష్టి ఇచ్చింది?' అన్నాడు.

కాని భగవాన్ జవాబు చెప్పలేదు. ప్రపంచంలో జరిగే వాటన్నిటికీ కారణాలు చెప్పే తీరిక ఆయనకులేదు. అనుభవించి తెలుసుకునేందుకే ఈ సంఘటనలు వొస్తూంటవి...కళ్లు వున్నప్పటికీ తను అంధుడే_ శాశ్వతంగా!

జగన్నాథం ఎంత గుంజుకున్నా, తనను పట్టుకున్నవాళ్ళ పట్టు వొదిలించుకోలేక పొయ్యాడు. చూస్తూమాస్తూ నిండుప్రాణాన్ని బలిపెట్టలేని కరుణార్ద్రహృదయులైన మానవశక్తులు అతన్ని అదిమిపట్టినవి. అతని బాహ్యశక్తులు అలసిపోయినవి. అలాగే ఆ పట్టుకొన్నవాళ్ళచేతుల్లోనే మొవలు నరికిన అరటిచెట్టల్లే కూలిపొయ్యాడు!

ఐపోయింది.







# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B195 |
| పుస్తకం పేరు | సూక్తి వారధి |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseena |
| పేజీలు విడదీసినది | Haseena |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |